క. భీకరశోకాగ్నిశిఖా
నీకము శిథిలములోనబ్బ నెఱకులనెల్లన్
పైకొలుపు దేహశోషముఁ?
బ్రాకటముగ నంతరాత్మ వడిఁగ దహించున్.

(ఆలోచించి) "బిడ్డా! శ్రద్ధా! నేనిక్కడనుండి హింసాప్రధానమయిన యుద్ధమును జూడలేను కాఁబట్టి నేనీకాశీక్షేత్రమును విడిచి సాలగ్రామమను పేరుగల విష్ణుక్షేత్రమునందుఁ గొంతకాలము గడపెదను. నీవిక్కడకువచ్చి వృత్తాంతమును జరిగిన క్రమమున నాకు నివేదింపుము" అని విష్ణుభక్తిదేవి నాకాజ్ఞాపించినది కాఁబట్టి యాదేవిసన్నిధానమునకుఁ బోయి యీవృత్తాంతము సర్వమును నేనామెకు విన్నవించెదను (ముందునకు నడచి చూచి) ఇది యాచక్రతీర్థము. ఇందుసంసారసాగరోత్తారకమయిన నావకుఁ గర్ణధారుఁడైన భగవంతుఁడగు శ్రీహరి ప్రత్యక్షముగా వాసము చేయుచున్నాఁడు (ప్రణమిల్లి) ఇదిగో మునులచే నుపాస్యమానురాలయిన విష్ణుభక్తిదేవి శాంతితో నేదో యాలోచించుచున్నది. నేనామెకు సమీపమునకుఁ బోయెదను (అని ముందుకు నడుచుచున్నది.)

[అంతట విష్ణుభక్తియు శాంతియుఁ బ్రవేశించుచున్నారు]

శాంతి—అమ్మా! మీరు ప్రబలచింతాకులహృదయ లయి యున్నట్లు కానఁబడుచున్నారు.

విష్ణు—బిడ్డా! మహావీరతరమయినయీ ఘోరయుద్ధమునందు బలవంతుఁడైనమహామోహునితోఁ బ్రతిఘటించిన పుత్త్రప్రాయుఁడైన వివేకునివృత్తాంత మేమయినదో తెలియకపోయెనని నామనస్సు వ్యగ్రముగా నున్నది.

శాంతి—దేవీ! ఇక్కడ విచారింపవలసినపని యేమున్నది? దేవిగారియనుగ్రహమున్నందున వివేకమహారాజునకు విజయము నిశ్చయమని నేనెఱుఁగుదును.

విష్ణు—బిడ్డా.

క. ఘనధర్మపక్షబలమున
ననివార్యంబుగ లభించు నభ్యుదయంబుల్ ?
విను మట్లయ్యును, సుహృదుల
మనసెపుడు నపాయశంక మఱిమఱిఁ బూనున్.

అంతేకాక శ్రద్ధ యింతతడవు రాకుండుట మనస్సునకు సందేహము పుట్టించుచున్నది.

శ్రద్ధ—(సమీపమునకుఁ బోయి) భగవతీ! ప్రణమిల్లుచున్నాను.

విష్ణు—శ్రద్ధా! నీవు క్షేమముతో వచ్చితివా?

శ్రద్ధ—దేవిగారి యనుగ్రహమువలన.

శాంతి— అమ్మా! ప్రణామము చేయుచున్నాను.

శ్రద్ధ— పుత్రీ! నన్నాలింగనము చేసికొమ్ము.

శాంతి—(తల్లిని కౌఁగిలించుకొనుచున్నది)

శ్రద్ధ—బిడ్డా! విష్ణుభక్తి దేవిప్రసాదము చేత మునిజనమనోనివాసమును బొందుము.

శాంతి—అక్కడ నేమిజరిగినది ;

శ్రద్ధ—దేవిగారికిఁ బ్రతికూలముగాఁ బ్రవర్తించువారికిఁ దగినట్లు జరిగినది.

విష్ణుభక్తి—అది సవిస్తరముగాఁ జెప్పుము.

శ్రద్ధ—దేవీ! అవధరింపుము దేవి యట్లాదికేశవాలయమునుండి వెడలఁగానే తనపాటలవర్ణమును గొంచెము విడిచి సూర్యుఁడు ప్రకాశించుచుండగా విజయ ఘోషాహూయమానానేక వరవీరబాహుళిసింహనాదబధిరితదిగంతంబును సతతంధతురగ ఖురతరఖురఖండితభూమండలోచ్ఛలద్విపులరజఃపటలాంతరితభాస్కరబింబంబును బ్రబలతరకర్ణతాళాస్ఫాలనోచ్చలితమదకరికుంభసింధూరసంధ్యాయమానవళవిరంబును బ్రళయాజంధరిధ్వానభీషణంబును నగు వారియొక్కయు మనయొక్కయు సైన్యసాగరము సన్నద్ధమయి యున్నప్పుడు వివేకమహారాజు మహామోహమహారాజుకడకు న్యాయాయిక దర్శనుని దూతనుగాఁ బంపెను. అతఁడు పోయి మహామోహునితో నిట్లనియె—

మ. చను, విశ్వాల సుపుణ్యకాననదీ శాన్నిధ్యభక్త్యాంతరం
గనివాసంబు త్యజించి, మ్లేచ్ఛమహిఁ గింకేవ్ భృత్యవర్గంబుతో?
చనకున్నన్, గరవాలధారితభవత్సర్వాంగధారాచ్యుత
ఘనరక్తంబులు ద్రాగఁ గాఁతలేదునకుఁల్ మిర్రింగు మాంసముల్.

విష్ణుభక్తి—తరువాత తరువాత.

శ్రద్ధ—దేవీ! తరువాతఁ గోపముచేత వికటలలాటతటతాండవితభ్రుకుటియై మహామోహుఁడు—"ఈదుర్నయపరిపాకఫలము వివేకుఁ డనుభవించును గాక!" అని పలికి, తానే మొట్టమొదటఁ బాషండాగమబృందములను పాషండశాస్త్రసహితముగా యుద్ధమునకుఁ బురికొల్పెను. ఈలోపల మా సైన్యముఖమునందు,

గీ. వేదవేదాంగతతు లుపవేదసమితి
స్మృతిపురాణేతిహాసాదు లెలమిఁ గొలువఁ,
జంద్రసమకాంతితో సరస్వతి, సరోజ
కర యగుచు నిల్చె నాకస్మికముగవచ్చి.

విష్ణుభక్తి—తదనంతరము.

శ్రద్ధ—దేవీ ! అప్పుడు వైష్ణవ శైవ సౌరాదులయిన సర్వాగమబృందములును సరస్వతీదేవి సకాశమునకు వచ్చెను.

విష్ణు—అటుతరువాత.

శ్రద్ధ—తదనంతరమున—

శా. వేదాంతమీమాంస, సరస్వతీసతిపురోవీథిన్ రణోత్సాహయై,
ప్రాముఖ్యస్థితి న్యాయకాపిలమహాభాష్యాదిసద్గ్రంథ
స్తోమంబు లొక్కుమ్మడిగ ధర్మరుచి స్ఫూర్తి, శుద్ధాద్యుతన్యాయకో
ర్భ్రమాకారిణి నిల్చె, దుర్గంధరణిన్, వేదత్రయీ నేత్రిగాన్.

శాంతి—స్వభావప్రతిపక్షము లయినయాగము న్యాయశాస్త్రప్రభావము లొక్కటిగాఁ గలియుట యెట్లు సంభవించినది ?

శ్రద్ధ—పుత్రీ !

క. ఇతరేతర వైరమునన్
సతము మెలఁగు నేకవంశజాతులు తమకున్
క్షితిలోపల నవమానం
బితరులచేఁ గల్గుచోట నేకముకారే ?

నేకప్రమాతము లయినతమకు లోలోపల విరోధమున్నను, వేదసంరక్షణముకొఱకును నాస్తికపక్షాధిక్షేపణముకొఱకును శాస్త్రసంఘముల కైకమత్యము కలుగును. ఆగమసముదాయములో సహితము విరోధము తత్త్వవిచారములకుఁ గానరాదు. ఎట్లన—

శా. శాంతం బద్వైతు మవ్యయం బజము శేశ్వాద్బ్రహ్మ, మాతత్త్వము
శ్రాంతం బాగమపంక్తిచే సగుణతన్ బ్రహ్మచ్యుతేశాఖ్యలన్
గంతొప్పన్ బహుధా స్తుతింపగఁబడున్ ? నానాగమశ్రేణి సం
క్రాంతింబొందుఁ బ్రహ్మమంతయును, సమవ్రింపందు నెల్లన్ బలెన్.

విష్ణు—తరువాత ? తరువాత ?

శ్రద్ధ—దేవీ ! తరువాత నిరువాగునను నిరంతరశరనికరధారాసంపాతోపదర్శితమర్దనులగు కరితురగరథపదాతులకును నుభయపక్షయోధజనులకును సంకులసమరంబు సంప్రాప్తమయ్యెను. అప్పుడు,

మ. ప్రవహించె న్నదులసృక్తోయములుఁ, గ్రవ్యస్ఫారపంకంబులున్,
వివిధోద్యద్ఘనకంకరంకనివహోద్భిలావకీర్ణాంబులున్,
నవనారాచవిభిన్నహస్తిగిరిశీర్ణభ్రష్టవేగోల్లస
ద్ధవళచ్ఛత్రసమూహహంసములు వైతద్యద్వరంగంబులన్.

ఆమహాదారుణసంగ్రామంబునందుఁ బరాపరపక్షపాతిత్వముచేతఁ బాషండాగమ
బృందమును ముందుంచుకొని వచ్చినలోకాయతికతంత్రసముదాయము మాన్యాన్యసైన్య
విమర్దనముచేత విధ్వస్తమయ్యెను; అనంతరము పాషండాగమజాలము నిర్మూలమగుట
చేతసదాగమసాగరప్రవాహముచేతఁ గొట్టుకొనిపోయెను. తదనంతరము సౌగతాగమ
సముదాయములు సింధుగాంధారమగధాంగపారశీకవంగకళింగాది మ్లేచ్ఛప్రాయదేశము
లఁ బ్రవేశించెను. పాషండదిగంబరకాపాలికాద్యాగమసంచయంబులు పామరబహుళంబు
లైన పాంచాలమాళవాభీరావర్తసాగరానూపదేశములయందు నిగూఢముగా సంచరించు
చున్నవి; న్యాయానుగతయైన మీమాంసచేత గాఢప్రహారజర్జరీకృతములైన నా
స్తికతర్కసమూహంబులు తమయాగమసందోహంబులు పోయినదారినే పోయినవి.

విష్ణు—అటుతరువాత,

శ్రద్ధ—అటుతరువాత వస్తువిచారునిచేతఁ గాముఁడు హతుఁడైనాఁడు; క్షమ
చేతఁ గ్రోధపారుష్యహింసాదులు హింసింపఁబడినారు; సంతోషునిచేత లోభతృష్ణా
దైన్యానృతవాదపైశున్యస్తేయపరిగ్రాహులు నిగ్రహింపఁబడినారు; అనసూయచేత
మత్సరుఁడు జయింపఁబడినాఁడు; పరోత్కర్షసంభావనునిచేత మదుఁడు సంహరింపఁ
బడినాఁడు; పరగుణాధిక్యునిచేత మానుఁడు ఖండింపఁబడినాఁడు.

విష్ణు—(హర్షముతో) చక్కఁగా జరిగినది. ఇఁక మహామోహునికథయేమయినది?

శ్రద్ధ—దేవీ! మహామోహుఁడు యోగవిఘ్నసహితుఁడయి యెక్కడనో
యడఁగి యుండుటచేత నాతనిజాడ తెలియరాకున్నది.

విష్ణు—అట్లయినచో మహానర్థశేషమింకనునిలిచియేయున్నది. అతఁడుపరిహర
ణీయుఁడు. ఎట్లన—

క. పరమాదరపరుఁ డగుచున్,
శ్రీరసంపదఁ గోరు శేముషీమంతుం డిం
దరిశేష మగ్నిశేషము
గురుతరఋణశేష ముంచఁగూడదుసుమీ.

ఇఁక మనస్సుయొక్క వృత్తాంతమేమి?

శ్రద్ధ—దేవీ! పుత్రపౌత్రాదిమరణజాతశోకావేశముచేత నాతఁడు ప్రాణ
త్యాగము చేయనిశ్చయించుకొన్నాఁడు.

విష్ణు—(చిఱునవ్వునవ్వి) ఇదియంతయు నిట్లయ్యెనేని మనము కృతార్థతను
బొందినారము; పురుషుఁడును బరమానందమును బొందును. అయిననుదురాత్ముఁడయిన
యతఁడు ప్రాణత్యాగమేల చేసికొనును?

శ్రద్ధ—ఉపనిషద్దేవి ప్రబోధోదయమునకై గృహీతసంకల్పురా లయి యున్నందున నతఁ డీవిధముగా శరీరముతోఁ జిరకాలముండఁడు.

విష్ణు—అగుఁగాక! వైరాగ్యోత్పత్తికొఱకు వైయాసికియైన సరస్వతిని నేనాతని కడకుఁ బంపెదను.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

---

(అప్పుడు మనస్సును, సంకల్పుఁడును, ప్రవేశించుచున్నారు.)

మన—(కన్నీటితో) హా! పుత్త్రకులారా! ఎక్కడకుఁబోయినారు! ఒక్కసారి మీప్రియదర్శనమిండు. ఓకోరి కుమారులారా! రాగద్వేష మద మాన మాత్సర్యులారా! నన్నుఁ గౌఁగిలించుకొండు. నాయంగములు నొచ్చుచున్నవి. అమ్మో! అసాధుఁడను వృద్ధుఁడను నయియున్న నన్నొక్కఁడయిన పాలింపఁడేమి? ఓయసూయాదులైన కన్యకలారా, మీరెందుఁబోయినారు, ఆశాహింసాతృష్ణాదులైన కోడండ్రారా! మంచి భాగ్యుఁడనైన నాకొక్కరును దక్కకుండ దైవహతకుఁడు మిమ్మందఱ నేక కాలమునం దెత్తుకొనిపోయినాఁడు! (తడఁబాటుతో)

మ. తనువెల్ల న్విషవహ్నియట్లు మెదుచున్; దాఁ గాల్చెడు న్మర్మముల్;
పెనుపొందించెడుఁ దీవ్రవేదనల; నైపెంపెల్ల మర్దించెడిన్;
ఘనమోహం బెదఁ గూర్చెడున్; వరవివేకంబెల్లఁ బోకార్చెడున్;
మనమున్ జీవితమున్ గ్రసించెడు, వెసన్ శోకజ్వరం బక్కటా!

(అని మూర్ఛిల్లుచున్నాఁడు)

సంక—ఓరాజా! తెప్పిఱిలుము.

మన—(తెప్పిఱిల్లి) ఇట్టియవస్థను బొందియున్న నన్ను జననియైన ప్రవృత్తి సహిత మోదార్పకున్న దేమి?

సం—(కన్నీరు విడుచుచు) దేవా! ఇంకను నీకుఁ బ్రవృత్తిదేవి యెక్కడిది? కుటుంబమరణసంజాతశోకానలదగ్ధహృదయ యయి యామె గుండెలుపగిలి మృతి నొందినదని విన్నాఁడను.

మన—హా! ప్రియురాలా! నాకొక్క ప్రియమయిన ప్రతివచనమేలయియ్యవు? కటకటా!

ఉ. దేవిరో! నన్నుఁబాసి మను త్రిమ్మరవెన్నఁడు స్వప్నమందునన్
నీ వెడఁబాసియుండుటను నెమ్మితకల్పుఁడనైతి నిత్తఱిన్;

దైవవిచేష్టితంబునను దవ్వుగఁ బోయెడివారు నీవు, నేఁ డహో !
జీవము గోడనుండెద ; నిసీ ! యెనుకున్ కరమున్ దురంతముల్.

(అని మరల మూర్ఛపోవుచున్నాఁడు.)

సంక—ఓరాజా ! ఊఱడిల్లుము, ఊఱడిల్లుము.

మాన—(తెలివి తెచ్చుకొని) ఇఁక నాకు జీవితాశచాలును ఓసంకల్పా ! చితి పేర్పుము ఇప్పుడు నే నగ్నిప్రవేశము చేత శోకానలము నార్పుకొనియెదను.

(అని సన్నాహపడుచున్నాఁడు)

[అప్పుడు శ్యామసరస్వతి ప్రవేశించుచున్నది]

సర—"సఖీ ! సరస్వతీ ! అపత్యమరణఖిన్నుఁడయియున్న మనస్వి యొక్క పరిబోధముకొఱకుఁబొమ్ము. అతనికి వైరాగ్యోత్పత్తి యెట్లు కలుగునో యట్లుచేయుము" అని భగవతియైన విష్ణుభక్తి నన్నుఁ బంపినది కానిమ్ము. నేనిప్పుడాతని సన్నిధికే పోయెదను. (సమీపమునకుఁబోయి) వత్సా ! ఈవిధముగా నీవతిసంతాపము నేల పొందెదవు ; పదార్థము లనిత్యములని నీకీపటికిఁ దెలిసినదే కదా ! ఇతిహాసములును, ఉపాఖ్యానములును, నీవీవఱకుఁ జదివినవే.

చ. అరయ విరించి యాదిగ్రితొ సురాసురులున్ మునిముఖ్యులున్ నృపాల్
ధరణియు వార్ధి దిక్పతిగుణంబులు కల్పశతాయువు న్నెగన్,
బొరసెడు ఘోర శోకకర మోహము ! స్వీయులబుద్బుదోపమా
స్థిరతనుసంహతుల్ తెగి నశించినయప్పుడు శోకము లేమనన్ ?

కాఁబట్టి పుత్త్రాదిపదార్థములయనిత్యత్వమును భావించుకొమ్ము. నిత్యానిత్యవస్తువివేక మెఱుఁగువానిని శోకమంటదు.

గీ. బ్రహ్మ మొక్కటియే సత్యవస్తువగుచు
నితర మెల్ల వికల్పిత మెప్పుడగును,
యప్పు డేకత్వమును జూచు ? నట్టివాని
కెక్కడిది మోహశోకంబు లెంచిచూడ ;

మాన—భగవతీ ! శోకావేగమూర్ఛితమయి యున్న నామనస్సునం దిప్పుడు వివేకమునకే యవకాశము లేదు.

సర—వత్సా ! ఇది స్నేహదోషము స్నేహము సర్వానర్థమూలకమన్న యీయర్థము సుప్రసిద్ధమే కదా !

మ. ప్రియనామంబునఁ గ్లేశదుర్విషలతాబీజంబుల న్నాటఁగాఁ
బయికిన్ స్నేహమయాంకురంబు లడరున్ వజ్రాగ్నిగర్భంబులై ;

బయలం బ్రాఁకుచు శోకవృక్షము లిటుల్ బహ్వర్తి శాఖాశిఖల్
బయివారన్ శతముల్ తపాగ్నిగతి మ్రగ్గంగాల్చు దేహంబులన్.

మన — దేవీ ! ఇది యంతయు సత్యమే. అయినను శోకానలదగ్ధుఁడ నయిన నేను ప్రాణములు నిలుపుకొనుటకు శక్తుఁడను గాకున్నాను. అంత్యకాలమునందు మీ దర్శనమగుట మేలయినది.

నర — ఓయీ ! ఈ కాలిక్రమహత్యాప్రయత్నము మిక్కిలి యాశ్చర్యము. అంతే కాక యీ యపకారములనిమిత్తము నీకీ వేగిరపాటేల ? ఆలోచించి చూడుము —

ఉ. ధరపయి వెన్క ముందిపుడు దారసుతాదిపరిగ్రహంబు చేఁ
బురుషసుఖార్థమై కలుగఁబోవదు మేలది నీకు నేటికిన్ ?
మరణము నొంది వారిపుడు మగ్నశిఖేద మొనర్తు రార్తిచే ;
నను లటులయ్యుఁ గాంతువు ఘనశ్రమ వ్యర్థముగాఁ దదర్థమై.

చ. కటకట ! వారికై శ్రమలు గాంచనికష్టము లేని యీభువిన్ ;
పటుగతి నెన్ని కొండ లెగఁ ప్రాఁకిరి ; వాఁకలదాఁట రెన్నిటన్ ?
దటుకున నెన్ని ఘోరవిపినంబులు ద్రొక్కరు ; చిత్తమత్తులన్
గుటిలవినష్టవస్త్రిలను క్షుద్రనరేశులఁజూడ రెంపటన్ ?

మన — దేవీ ! ఇది నిశ్చయమే అయినను,

క. తనవలనఁ బుట్టి లాలన
మునయంబున గనుచు మనసునందే యెపుడున్
మనియెడువారలఁ బాయుట
తనప్రాణముపోకయట్లు తలకొల్పు వ్యథన్.

నర — వత్సా ! ఈ వ్యామోహము మమకార వాసనామూలము.

గీ. ఇంటికోడిని మార్జాల మీడ్చితెచ్చి
మ్రింగునప్పుడు కలిగెడు మేటిశోక
మెలుకనో పిచ్చుకనో భుజియించునప్పు
డొదవమి తలంప మమత లేకునికిఁ గాదె ?

కాఁబట్టి సర్వవిధములచేతను సర్వానర్థబీజమయిన మమత్వమును రూపుమాపు ప్రయత్నము చేయవలయును. చూడు —

చ. జననము నొందు దేహమున జంతువు లెన్నియొ మర్త్యకోటికిన్ !
తనువునుండి యత్నమునఁ దాను వెలార్చుననందుఁ జెక్కటిన్ ?
విను మిఁక నందు బిడ్డలని పేరిడి కొన్నిటికిన్ , దదర్థమై
ధనమును నష్టపెట్టు నిజదేహము ?. లోకము మోహమేమునన్ ?

నంతట ప్రవేశపెట్టవలయును.

మన—భగవతీ! ఆశాంతవిషయమేదో ప్రసాదింపుము.

సర—వత్సా—అది రహస్యమైనది. అయినను శోకార్తున కుపదేశించుటలో దోషములేదు,

చ. స్థిరమతి నీలనీరదసగదేహుని శ్రీహరి నొందదే, తామసం
హరువడ జాలకుండ నరు డాహా యనొందడే వలంపు; లేనిచో,
నిరతిని గ్రీష్మవేళ మరీచిక్కాలంకుసు బోలె నాత్మన
ప్పరము నింపు శోకమును బ్రహ్మనుం జేసి భజించు నిర్వృతిన్.

మన—(ఆలోచించి నిట్టూర్పుతో) సర్వవిధములచేతను నేను దేవిగారిచేత రక్షింపఁబడినాఁడను. (అని పాదములపైఁ బడుచున్నాఁడు.)

సర—వత్సా! నీహృదయ మిప్పటి కుపదేశయోగ్యమయినది. కాఁబట్టి నీకు మఱియొకటికూడ నుపదేశించెదను.

మ. జనకుండో సుతుఁడో సఖుండో తనువుం జాలింప, ధీశూన్యులి
మ్మన శోకాగ్నిదహించుకొంచెయు నుగ్రమ్ము లోఁగుదు కాంచ బోకట్టుటన్;
కన సంసార మసారమంచు శమసౌఖ్యంబుం గనం జేయుచున్
ఘనధీమంతుల కావిర్యోగపదమే కల్గించు వైరాగ్యమున్.

[అప్పుడు వైరాగ్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వైరా—(ఆలోచించి)

మ. నవనీలోత్పల కోమలచ్ఛదముకన్నన్ సూక్ష్మపత్రావళుల్ మా
నవదేహంబులపై విధాతృఁడిటు నింప న్మాంసకుల్యస్సన్, సదా
స్రవదస్రాస్రుమిశ్రమాంసమిసర గాత్రాగత ధ్వాంక్షగృ
ధ్రవృకశ్వానములన్ మరల్పఁగను సాధ్యంబౌనె యెవ్వారికిన్?

మఱియును,

మ. తటినీగ్రామోలను కల్పజాలము; వసోద్యద్గేహము ద్దేహముల్;
స్ఫుటసంభోగరసంబు లింద్రజాలంబుల్; లోకముల్ శోకముల్;
ఘటితాంచద్ధనము సమ్మోహనిధనముల్; హామ ప్రాపత్తిమ, ల
క్కటా! యక్కటా! జంతు రాత్మనిరతు గ్రాశీఘ్రపంథన్ జనుల్.

సర—వత్సా! ఇదె వైరాగ్యుఁడు నీదగ్గరకు వచ్చుచున్నాఁడు. ఈతనిని గౌరవింపుము.

మన—నాపుత్రుఁడు వైరాగ్యుఁడా?

వైరా—(సమీపమునకుఁబోయి) అయ్యా! నేను నమస్కారము చేయుచున్నాను.

మన—వత్సా! పుట్టగానే నీవు నన్ను విడచిపోతివి. నన్నుఁ గౌఁగిలించుకొమ్ము.

వైరా—(ఆలింగనము చేయుచున్నాఁడు.)

మన—పుత్రా! నిన్నుఁ జూచుటవలననే నా శోకావేశము ప్రశాంతమయినది.

వైరా—తండ్రీ! ఇక్కడ శోకావేశమున కవకాశమెక్కడనున్నది?

ఉ. దారిని బాంథు, లేటివరదన్ దమకాండము, లోకసనంబులన్
వారిదముల్. సముద్రమున నావికులున్! వడిఁగూడిపోయిన
ట్లారయఁ దల్లిదండ్రులును నాత్మజులున్ సఖులున్ సహోదరుల్
చేరుచుఁ బాయుచుందు రిది సిద్ధము; ప్రాజ్ఞుల కేడ శోకముల్?

మన—(ఆనందముతో) దేవీ! నా కుమారుఁడు చెప్పినది యథార్థమే.

చ. అలసనయానల్ లలన, లాయువులావలసత్కృణ్జసజం,
బలనవమల్లికాసురభిళానిలకందళముల్, తలంప ని
ర్మలసువివేకమార్జితతమంబగు మన్మతి కిప్డు డెందమా
వుల జలమట్లు మిథ్యలయి పొల్పతి సోఁచెనుఁ దొంటివన్నియున్.

సర—వత్సా! ఇదియంతయు సత్యమే యయినను గృహస్థాశ్రమధర్మమును విడిచి యుపరాంతకాలమయిన నుండఁగూడదు. కాఁబట్టి నేఁడు మొదలుకొని నివృత్తి దేవియే నీకు సహధర్మచారిణి కాఁగలదు.

మన—(లజ్జతో) దేవియాజ్ఞకు బద్ధుఁడను.

సర—శమదమసంతోషాదు లయిన పుత్రులు నీకుపచారములు చేయుదురు; యమనియమాదులు మంత్రులగుదురు; వివేకుఁడును నీయనుగ్రహమువలననే యుపనిషద్దేవితోడఁగూడ యౌవరాజ్యసుఖ మనుభవించుచుఁగాక! మైత్రి మొదలయిన నీతోఁబుట్టువులు నలువురును నీయనుగ్రహము కొఱకు భగవతియైన విష్ణుభక్తి దేవిచేతఁ బంపఁబడినారు. వారిని ప్రసాదపూర్వకముగా నంగీకరింపుము.

మన—దేవి యాజ్ఞాపించినట్లు చేసెదను. మీయాజ్ఞలన్నిఁటిని శిరసావహించినాఁడను. (అని హర్షముతోఁ బాదప్రణామము చేయుచున్నాఁడు.)

సర—ఈ యమనియమాసనప్రాణాయామాదులును చిరంజీవివైన నీచేతనాదరపూర్వకముగాఁ జూడఁదగినవారు. వీరితోఁగూడి నీవు సామ్రాజ్య మధిష్ఠింపుము. నీవు స్వాస్థ్యమును బొందినప్పుడు జీవాత్ముఁడును దన ప్రకృతిని బొందును.

మ. రవిబింబంబు పయోధివీచులబలెన్, బ్రహ్మంబొకండయ్యు సం
భవనాశాదులు పొందితోఁచు బహుతన్ ద్వంద్వసంగతిన్ వృత్తులన్;

దివుటన్ వృత్తు లడంచి నీవిఁక నివృత్తిం గూడితే, నాత్మయున్,
రవిబింబం బుదకప్రణంబునవలెన్, శాస్త్రైకలభ్యం బగున్.

కాని ముక్తి. జ్ఞాతుల కుదకప్రదానము చేయుటకొఱకు మనము నదికిఁ బోవుదము.

మన—దేవి సెలవిచ్చినట్లు చేయుదము.

[అందఱును నిష్క్రమించుచున్నారు.]



## షష్ఠాంకము.



[అప్పుడు శాంతి ప్రవేశించుచున్నది.]

శాంతి—(వృత్తి)! నీకంతయుఁ దెలిసినదేకదా?

చ. కామములు పరంపరం గనఁగ గూఢముగాఁ జని మోహుఁడేడనో
యడఁగుటచే విరక్తుఁడయి యల్లమనస్సు ప్రశాంతి నొందఁగా,
వడిగను క్లేశపంచకము పాయుటచేఁ బురుషుండు సొక్కుటన్
గడుకొని తత్త్వబోధమునఁ గాంతుఁడొనర్చెడు నెల్లయప్పుడున్.

కాఁబట్టి నీవతిత్వరితముగా నుపనిషద్దేవి ననునయించి నాసమ్ముఖమునకుఁ దీసికొనిరమ్ము. అని వివేకమహారాజుగారు నాతో సెలవిచ్చినారు. (చూచి) ఇదిగో తనలోఁదా నేదో సంతోషముతో నాలోచించుకొనుచు నాతల్లి యీవంకనే వచ్చుచున్నది.

[అంతట శ్రద్ధ ప్రవేశించుచున్నది]

శ్రద్ధ—ఓహో! రాజకుల మారోగ్యమును బొందఁగాఁజూచి యిప్పుడుగదా చిరకాలమునకు నాకన్ను లమృతరసపూర్ణము లయినవి.

గీ. కలిగె ఖలనిగ్రహము రాజకులమునందుఁ;
బూజ్యులైరి శమాదిసద్గుణములెల్ల?
జీవులెల్లను వశ్యులై సేవచేయ,
నెసఁగుచున్నారు సర్వలోకేశ్వరుండు.

శాంతి—(చేరఁబోయి)అమ్మా! నీవునిలుచుండి యేమియాలోచించుచున్నావు?

శ్రద్ధ—బిడ్డా! రాజకుల మారోగ్యమును బొందఁగాఁ జూచి చిరకాలమునకిప్పుడుగదా నాకన్నులమృతరసపూర్ణము లయినవి.

గీ. కలిగె ఖలనిగ్రహము రాజకులమునందుఁ;
బూజ్యులైరి శమాదిసత్పురుషులెల్ల ;
జీవులెల్లను వశ్యులై సేవచేయఁ,
నెసఁగుచున్నాఁడు సర్వలోకేశ్వరుండు.

(అని మరలఁ పఠించుచున్నది.)

శాంతి—ఇప్పుడు మనస్సువిషయమున స్వామియైన పురుషుని ప్రవర్తనమెట్లున్నది?

శ్రద్ధ—పథ్యానివిషయములను నిగ్రాహ్యవిషయములను నెట్లుండవలయునో యట్లున్నది.

శాంతి—అట్లయిన, స్వామియే సామ్రాజ్యము నలంకరించునా యేమి?

శ్రద్ధ—దానికి సందేహమేమి? ఆత్మానుసంధానము చేసినయెడల, స్వామియే స్వారాట్టును సమ్రాట్టును నగును.

శాంతి—ఇఁక జీవేశ్వరునకు నాయందెట్టి యనుగ్రహము గలదు?

శ్రద్ధ—నిగ్రహమని చెప్పవలెను. అనుగ్రహమెట్లు శక్యమగును? పురుషుఁడిప్పుడు సర్వానర్థబీజభూత యయినయామాతను సర్వథా నిగ్రాహ్యురాలని తలఁచుచున్నాఁడు.

శాంతి—అట్లయినపక్షమున, రాజకులముయొక్క స్థితి యిప్పుడెట్లున్నది ;

శ్రద్ధ—వినుము. పురుషునకు—

శా. నిత్యానిత్యవిమర్శ యిష్టసతి ; సన్మిత్రుండు వైరాగ్యుఁ; డా
త్మాస్యంతాగ్రహితుల్ యమాదులు ; సహాయాప్తుల్ యమాద్యుత్తముల్ ;
మైత్ర్యాదుల్ పరిచారికల్ ; సహచరీమాతల్లి మోక్షేచ్ఛ ; దు
ష్కృత్యుల్ మోహమమత్వముఖ్యరిపు లుచ్ఛేద్యుల్ బలాత్కారతన్.

శాంతి—మఱి ధర్మునియెడల స్వామి కెట్టి ప్రీతికలదు?

శ్రద్ధ—పుత్త్రీ! వైరాగ్యసన్నికర్షమయినది మొదలుకొని స్వామియిహపర ఫలభోగములయందు నితాంతమును విరక్తుఁడయియే యున్నాఁడు. అందుచేతనే యతఁడు

గీ. నరకహేతువౌ పాపంబునకును బోక,
నశ్వర మని పుణ్యఫలంబునకును బోఁడు ;
శుద్ధనిష్కామతను జేయుసుకృతకర్మ
మునకు నెట్టిలో తా నియ్యకొనుచు నుండు.

ఇట్లు స్వామి యాత్మైకనిష్ఠుఁడయి యుండుట కనిపెట్టి ధర్ముఁడు తాను గృతకృత్యుఁ డయినట్లెంచుకొని తనకుఁదానే తనవ్యాపారమును వదలుకొన్నవాఁడయ్యెను.

శాంతి—అప్పుడు యోగవిఘ్నములను వెంటఁగొని మహామోహుఁ డదృశ్యుఁ డాయెనే, వారివృత్తాంత మేమి?

శ్రద్ధ—పుత్రీ! అట్టిదురవస్థను బొందినవాఁడయ్యును మహామోహుఁ డతఁడు స్వామిని మోసపుచ్చుటకయి మధుమతి యనువిద్యతోడఁ గూడ యోగవిఘ్నులను బనిపెను. స్వామి వారియందుఁ దగులుకొన్న యెడల, వివేకుఁ డుపనిషచ్చింత నైనను జేయకుండునని వాని యభిప్రాయము.

శాంతి—ఔరా! తరువాత! తరువాత?

శ్రద్ధ—తరువాత వారుపోయి స్వామికొక దైవప్రకాలికవిద్యను జూపిరి. వాలోకయత్యాశ్చర్యకరరూపమును జూపి సంభ్రమముతో నిట్లనిరి. ఓస్వామీ!

చ. అచిరముగా నితెంబొ వినువబ్రిపడక్ శతయోజనధ్వనుల్ ;
ప్రమదము చేయు మున్నవనిభారితదివ్యపురాణగంధముల్ ;
రచనయొనర్చు శుద్ధపదరమ్యత స్వేచ్ఛను గావ్యశాస్త్రముల్ ;
ఖచరగతిం జరింపను జగంబుల ; దొరుకును శిష్యులెల్లరున్.

అత్తఁడు మధుమతీవిద్యచేతఁ గల్పింపఁబడిన ప్రదేశమును జేరఁగా, స్థానాభిమానదేవతలాశ పుట్టునట్లుగా నిట్లనిరి:—అయ్యో! ఇందుఁ గూరుచుండుము ; ఇక్కడ జననమరణములు లేవు? ఈప్రదేశము సహజసుందరమయినది? వివిధవిలాసవేషలావణ్యవతులును బుణ్యమంతులును మంగళస్త్రీగ్రహణులును ప్రణయకృత్యచతురలును నగువిద్యాధరకాంతలు వీరె నీయొద్దనున్నారు. కాఁబట్టి యిటు రమ్ము.

గీ. కనకసికతాస్థలములు కలుగునదుల,
ఘనజఘనలు వశోరులౌ కమలముఖులఁ,
మరకతచళవృక్షవనసాలిఁ, బొరయుమీవు
పుణ్యసముపార్జితాఖిలభోగములను.

శాంతి—అటుపిమ్మట?

శ్రద్ధ—పుత్రీ! ఆమాటలువిని మాయ యిది శ్లాఘ్యమయినదని చెప్పెను; మనస్సనుమోదించెను. సంకల్పుఁడును బ్రోత్సాహపఱిచెను. స్వామి యంగీకారమార్గమును బొందినవానివలె నుండెను.

శాంతి—(ఖేదముతో) అయ్యో! స్వామి మరలసంసారవాగురలోఁ దగులుకొనుచున్నాఁడు.

శ్రద్ధ—లేదు. లేదు.

శాంతి—అవల నేమిజరిగినది?

శ్రద్ధ—అప్పుడు పార్శ్వవర్తియైన తర్కుఁడు వారినందఱిని క్రోధావేశకషాయితలోచనుఁడయి చూచి, స్వామినిగూర్చి యిట్లనియె:—"ఓస్వామీ ! విషయామిషగార్ధ్యసాభిలాషులును సభాప్రతారణపూర్వకులును నైన వీరిట్లు నిన్ను మరల దుస్సహ విషయాగ్ని జ్వాలలయందుఁ బడఁద్రోయుచుండఁగాఁ దెలిసికోలేకున్నావేమి ?

క. భవసాగరమును దాఁటఁగ
 సవలీలం బ్రాప్త మైనయాలయోగతరిన్
 దవుల విడనాడి వెస నీ
 వవగాహన మేల చేసె దంగారనదిన్?

శాంతి—అటుతరువాత ?

శ్రద్ధ—అప్పుడాతనిమాటవిని, 'విషయసుఖములకు నమస్కార'మనిపలికి, పురుషుఁడు సాధుమతిని దిరస్కారము చేసెను.

శాంతి—మేలు ! మేలు ! నీవిప్పుడెక్కడకు బయలుదేరినావు ?

శ్రద్ధ—"నేను వివేకునిఁ జూడఁగోరుచున్నాను. కాఁబట్టి నీవాతనిని శీఘ్రముగాఁ గొనిరమ్ము." అని స్వామి నాకాజ్ఞయిచ్చెను. కాఁబట్టి నేనిప్పుడు మహారాజు సన్నిధికి బయలుదేరినాను.

శాంతి—నాకును మహారాజుగారుపనిషద్దేవిని దీసికొనిరమ్మని యాజ్ఞయిచ్చినారు. కాఁగాక ! మనము స్వామినియోగమును నెఱవేర్తము.

(అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

---

[అప్పుడు పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పురు—(ఆలోచించి హర్షముతో) ఓహో ! ఏమి యీవిష్ణుభక్తిదేవిమాహాత్మ్యము ; ఆమె యనుగ్రహముచేత నేను—

మ. వడిఁగ్లేశోర్ము లతిక్రమించి, మమతావర్తంబులన్ దాఁటితిన్ ;
 గడచితిన్ మిత్రకళత్రబంధుమకరగ్రాహంబులం దోలితిన్ ?
 జెడఁగా నార్చితిఁ గ్రోధబాడబశిఖిన్ ; దృష్ణాలతల్ ద్రెం
 గడు సంసారసముద్రతీర మిపు డేఁ గంటిన్ సమీపింపఁగన్

[అంతట నుపనిషద్దేవియు శాంతియుఁ బ్రవేశించుచున్నా

ఉప—సఖీ ! ఇట్లు నిర్దయుఁడయి యుండినభర్తయొక

చూడఁగలను ? అతనిచేత నేను చిరకాలము పరదారవలె విడిచిపెట్టఁబడి యేకాకిని
వయి యుంటిని.

శాంతి—దేవీ ! అవిధముగా నాపదలపాలయినభర్తగారి నేల నిందించెదవు ?

ఉప—సఖీ ! ఇట్లుచెప్పెదు నీ వప్పటినాకష్టదశను జూడలేదు వినుము—

చ. అకట ! వివేకుఁ డిట్లు విధియత్నమునన్ నను దవ్వొనర్పుటన్,
సకలఖలుల్ కుబుద్ధి మెయి నన్ దమదాసిగఁ జేయ నీడ్వఁగా
శకలములై మణుల్ పడల జంకి చెడెం గరకంకణావళుల్ ;
ప్రకట శిరోమణుల్ గూలఁగ లాగుటచేఁ దెగెఁ గేశపాశముల్.

శాంతి—సఖీ ! ఇది యంతయు నామహామోహుని దుర్విలసితము. ఇందుభర్త
గారి యపరాధ మేదియు లేదు. వానిచేతనే మనస్సు కామాదుల ద్వారమున మోహ
పెట్టఁబడుటచే వివేకుఁడు నిన్నుండి దూరము చేయఁబడినాఁడు. ఇట్లు విపన్నుఁ
డయిన నిజవల్లభునిసమయము ప్రతీక్షించి యుండుట కులస్త్రీలకు నైసర్గికశీలము
కాఁబట్టి నీవువచ్చి దర్శనముచేతను బ్రియాలాపముచేతను భర్తను సంభావింపుము.
ఇప్పుడు శత్రులు హతముచేయఁబడినారు. నీమనోరథములు సంపూర్ణములయినవి.

ఉప—సఖీ ! నేనిప్పుడిట్లు వచ్చునప్పుడు నాకూఁతురైనగీతాదేవి రహస్యముగా
"స్వామియైన పురుషుఁడును భర్తయు నిన్నడిగినప్రశ్నలకు నుత్తరములు చెప్పి నీవు
వారిని సంభావింపవలయును ; తన్మూలమునఁ బ్రబోధోత్పత్తి కాఁగలదు." అని చెప్పి
నది. నేనెట్లు గురుజనులముందు బ్రాగల్భ్యమును జూపఁగలను ?

శాంతి—దేవీ ! భగవతియైన గీతాదేవియొక్క యీవాక్యమునకు విచారింపఁబని
లేదు. ఈయర్థము నే భగవతియైనవిష్ణుభక్తిదేవి వివేకస్వామితోడఁ జెప్పినది. కాఁబట్టి
వచ్చిభర్తను, ఆదిపురుషుని, నీదర్శనముచేత సన్మానింపుము.

ఉప—ప్రియసఖి చెప్పినట్లు చేసెదను. (అని ముందుకు నడుచుచున్నది.)

[అప్పుడు వివేకమహారాజును శ్రద్ధయుఁ బ్రవేశించుచున్నారు.]

వివే—ఓవత్సా! శ్రద్ధా! శాంతి నాప్రియురాలైనయుపనిషత్కాంతను జూచునా?

శ్రద్ధ—దేవా ! మీయాజ్ఞ నుదలఁదాల్చిపోయినశాంతి యామె నెట్లు చూడ[?]

ఎక్కడఁజూచును ?

[?]వా ! మందరపర్వతమునందు మధుసూదనాలయములో నామెతక్క
గాదేవిమఱుఁగు చొచ్చియున్నదనియీవఱకే విష్ణుభక్తిదేవి చెప్పినది
[illegible]లేల భయపడవలెను ?

శ్రద్ధ—దేవా! ఈసంగతి మీకామెయే వివరముగాఁ జెప్పఁగలదు. కాఁబట్టి దేవరవారు విచ్చేయుఁడు, ఇదె పురుషుఁడు మీయాగమనమునే తలఁచుకొనుచు నొంటిగా నున్నవాఁడు.

వివే—(చేరువకుఁబోయి) స్వామీ! అభివాదము చేయుచున్నాను.

పురు—వత్సా! ఈశిష్టాచారము ప్రక్రమవిరుద్ధమయినది. జ్ఞానవృద్ధుఁడవైననీవే నాకుపదేశదానముచేతఁ బితృభావమును బొందితివి ఎట్లన—

గీ. మున్ను ధర్మమార్గము తప్పి భూమిసురులు
తనయులను వేఁడుకొని రల్లదారి చూప;
శిష్యులుగ వారిజ్ఞానంబుచే గ్రహించి,
సుతులు 'సుతులార! వినుఁ'డని పితల ననిరి.

కాఁబట్టి నీవును మాయెడలఁ బితృత్వముచేత వర్తింపవలయును. అదియేధర్మము.

శాంతి—దేవీ! ఇదె వివేకునితోడఁ బురుషుఁ డొంటిగా నున్నాఁడు. సన్నిధికిఁ బొమ్ము.

ఉప—(సమీపమునకుఁ బోవుచున్నది.)

శాంతి—స్వామీ! ఉపనిషద్దేవి యిదిగో మీపాదవందనము చేయవచ్చియున్నది.

పురు—అట్లుకాదు. అట్లుకాదు. తత్త్వావబోధోదయముచేత నీ మెయే నాకు మాత. కాఁబట్టి నేనే యామెకు నమస్కరింపవలెను. అంతేకాక,

క. జనకి దేవకికిఁ గలది
ననుగ్రహముఁ జూపుటందునంతరమెంతో;
జనని భవబంధములఁ గడుఁ
బెనఁచును; బంధముల దేవి విడిపించుఁగదున్.

ఉప—(వివేకునిఁ జూచి నమస్కరించి దూరముగాఁ గూరుచున్నది.)

పురు—అమ్మా! నీవింతవఱకును దినము లెట్లుగడపితివో చెప్పుము.

ఉప—స్వామీ!

ఉ. పుచ్చితిఁ బెక్కునాళ్ళు ఘనమూర్ఖులతోడను నేమఠంబులన్,
రచ్చల, శూన్యదేవభవనంబుల, వృద్ధవచఃప్రసంగతిన్.

పురు—మఱి వారు నీచేతఁ దత్త్వము నేమైనఁ దెలిసికొన్నారా?

ఉప—లేదు. లేదు. వారు—

మచ్చిక ద్రావిడాంగనలమాటలకట్లు గ్రహింపకర్థమున్,
జెచ్చెర నస్మదుక్తులకు స్వేచ్ఛ నొనర్చి రపార్థకల్పనల్.

వారికి సాహాక్యార్థవిచారములని ప్రయోజన మంతయుం గేవలపరధనగ్రహణార్థమే.

పురు—తరువాత ? తరువాత ?

ఉప—తరువాత నేనొకచోట

మ. పరిపూర్ణాజ్యహుతాన్నిరాజితసమిద్వహ్నిప్రభావోపేతలై,
వరసోమేష్టిపశుప్రభృత్యురుమఖవ్రాతోగ్రసత్త్వాశ్వలై,
నిరతప్రాకృతకర్మకాండబహుధానిర్దిష్టమార్గాళిలై,
సరసం గ్రుమ్మరుయజ్ఞవిద్యఁ బొడగాంచం గంటి మార్గంబునన్.

పురు—అటుతరువాత ?

ఉప—తరువాతఁ బుస్తకభారవాహిని యైనయామెను నాతత్త్వమేమయినఁ దెలిసి యుండునని యెంచి నేనామెసన్నిధిని గొన్నిదినములు గడపవలెనని తలఁచితిని.

పురు—తదనంతరము ?

ఉప—తదనంతరము నేనామె సమీపమునకుఁబోఁగా, "ఓసుమంగళీ! నీకోరికయేమి ?" అనియామె నన్నడిగెను. "అమ్మా ! నేనిప్పుడనాథనయి యున్నదానను. కాఁబట్టి నీయొద్దనుండఁగోరుచున్నాను." అని నేను జెప్పితిని.

పురు—అటుపిమ్మట ?

ఉప—అటుపిమ్మట "ఓసుమంగళీ ! నీవుచేయుపనియేమి ?" అనియామె నన్నడిగెను.

పురు—అటువెనుక ?

ఉప—అప్పుడు నేనిట్లంటిని—

చ. ఎవ్వనిచేఁ జగంబు జనియించి రమించి లయించు, నీజగం
బెవ్వనికాంతిచే వెలుఁగు, నెవ్వనితేజము సత్సుఖోజ్జ్వలం,
బెవ్వనిఁ గల్చి ద్వైతము మేగఁ బునర్భవ మొందదెప్పుడున్
నెవ్వడఁ బుణ్యు, లాపురుషు నిత్యుని శాంతు స్తుతింతు నక్రియున్

అంతట యజ్ఞవిద్య యాలోచించి యిట్లనియెను—

గీ. అక్రియుఁడగు వాఁ డీశ్వరుండగుట యెట్లు ?
సత్క్రియలుగాని వస్తువిచారబుద్ధి
యరయ భవబంధనాశనకరము గాదు;
జనుఁడు భవనాశకరకర్మ లొనరఁ జేసి
వత్సరశతంబు శాంతుఁడై బ్రతుకఁగోరు.

పుర—అనంతరము,

ఉప—అనంతరము నేనామెను సహితము పూర్వమువలెనే యాశ్రయమును వేఁడితిని. అప్పు డామెయు "ఓసుమంగళీ ! నీవుచేయుపనియేమి?" అని నన్నడిగెను. అంతట నేను దొంటివలెనే "ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు" మొదలు గాఁగల వాక్యమును జెప్పితిని,

పురు—ఆవల ?

ఉప—ఆవల మీమాంస పార్శ్వవర్తులముఖమును జూచి "లోకాంతరఫలోపభోగయోగ్యుఁడైన పురుషునిఁ బ్రతిపాదించుటచేత మనకీమెవలనఁ బ్రయోజనము గలదు. కాఁబట్టి కర్మోపయుక్తయైన యీమెను స్వీకరింపుఁడు." అనిపలికెను. అక్కడ వారిలో నొకశిష్యుఁడు దాని ననుమోదించెను. ప్రసిద్ధప్రతిష్ఠుఁడైన కుమారిల స్వామియను మతి యొకఁడు మీమాంసాహృదయాధిదేవతయో యనునట్లుగా "దేవీ ! ఈమె కర్మోపయుక్తుఁడయిన పురుషునిఁ బ్రసాదింపదు; కర్తయు భోక్తయుఁ గానియీశ్వరునిఁ బ్రతిపాదించును. ఈమె కర్మలకించుకయు నుపయోగపడునది కాదు." అనెను. అప్పుడింకొకఁడు "లౌకికపురుషునికంటె నన్యుఁడయి యీశ్వరుఁడని యొకఁడున్నాఁడా?" అనియడిగెను. అంతనతఁడునవ్వి "ఉన్నాఁడు" అని కుమారిల నిట్లనియెను:—

చ. ఒకఁడుకనున్ జగత్క్రియల, నొక్కఁడు మోహయుతాంధబుద్ధియై;
నొకఁడిడుఁ గర్మజాలఫల, మొక్కఁడు తత్ఫలవాంఛఁ జేయుఁ; దా
నొకఁడు శరీరుల న్నడుపు, నొక్కఁడు కర్మముల న్నియుక్తుఁడౌ ;
నికను విసంగుఁడౌ పరము నెట్లుగుఁ జెప్పఁగఁ గర్మభోక్తఁగన్ ?

వివే—(హర్షముతో) మేలు ! కుమారిలస్వామీ ! మేలు ! నీవు మంచిప్రజ్ఞఁ గలవాఁడవు. నీవు దీర్ఘాయుష్మంతుఁడవుగమ్ము.

క. సహవాసులుఁ జెలులును నౌ
విహగంబులు రెండు నేకవృక్షము చేరున్ ;
విహగమొకటి తిను ఫలముల ;
నహహా ! రెండవది తినక యాలోకించున్.

పుర—తరువాత ?

ఉప—తరువాత నేను మీమాంసవద్ద సెలవుగైకొని వెడలితిని.

పురు—అటుతరువాత ?

ఉప—అటుతరువాత నేను శిష్యులు పలువుండ్రచేత నుపాస్యమానలైన తర్క[illegible] గాంచితిని. అంత.

మ. తెలుపు న్విశ్వవిశేష మోక్షగతితే వాదించుచున్ వితండావృతిన్
లలి జాతిచ్ఛలనిగ్రహాదికమహాన్యాయాళితో జల్పముల్ ;
పెలుచన్ వాదులు బూనుచుఁ బ్రకృతిసంక్షోభంబు లాకర్త. సం
ఖ్యలచే నెన్నుదుఁ దత్త్వముల్ మహదహంకారాదిసర్గంబులున్.

పురు—తరువాత ? తరువాత ?

ఉప—పూర్వోక్తినే నేనును వారి సమీపమునకుఁ బోయి, వారడిగినమీఁదట "ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు" ఇత్యాదివాక్యములచేత మునుపటి యట్లే నా కార్యమును జెప్పితిని. అప్పుడు వారు నన్నుఁ బ్రత్యక్షముగాఁ బరిహసించి "ఓ వాచాలులారా! విశ్వము పరమాణువులవలనఁ గలుగుచున్నది. ఈశ్వరుఁడు నిమిత్త కారణము" అనిపలికిరి. అందొక్కొకతె కోపముతో "ఓసిపాపాత్మురాలా! ఈశ్వరునే సవికారునిఁ జేసి వినాశధర్మము నాపాదించుచున్నావేమి?" అనెను మఱియొకతె "ఓసీ! విశ్వోత్పత్తి ప్రకృతివలనఁ" గలిగెనని పలికెను.

వివే—ఓహో! తర్కవిద్యాలెంతదుర్మతులు! ఘటాదికమువలెనే ప్రమేయజాతము సర్వమును గార్యమని సహిత మింతమాత్రము తెలిసికొనఁజాలకున్నారు. పరమాణువులును బ్రకృతియు నుపాదానకారణము లగుటయు నుపేక్షణీయమే.

మ. జలదభ్రముంబలె నంతరిక్షనగరస్వప్నేంద్రజాలంబు ల
ట్లలవిశ్వంబును మిథ్య, మేయమును గార్యంబౌట సాధ్యంతతన్ ;
కలుగున్ శుక్తిని వెండియట్లు శివుగాఁగం దెల్వఁ దద్జ్ఞానమిన్ ;
పొలియున్ స్రక్కునఁ బన్నగభ్రమువలెన్ బోధోదయప్రాప్తిచేన్.

ఇఁక వికారశంకయు ముగ్ధవధూమానస విలసితమే. ఎట్లన—

ఉ. శాంతము నిర్మలంబును నజంబు ననంతము నిష్కలంబు నౌ
సంతతతేజ మీభువనసంభవమందు వికార మొందునే ?
కాంతిని నల్లగల్వల నగంగలమబ్బులచాలు పుట్టుచో,
నింతయు నాకసంబు వహియించునె తాను వికారలేశమున్ ?

పురు—సాధు! సాధు ! ప్రజ్ఞావంతుఁడవయిన యీనీవిమర్శనము నాడెంద మానందపెట్టుచున్నది. (ఉపనిషద్దేవినిగూర్చి) తదనంతరము ?

ఉప—తదనంతరము వారందఱును మండిపడి, "ఓహో! విశ్వవిలయ ముక్తి కలుగునని ప్రేలుదు, నాస్తికమార్గము నవలంబించుచున్న దీనినిబట్ట వలెను" అని యందఱును ససంరంభముగా నన్ను నిగ్రహింపుట కుద్యు

పురు—(భయముతో) ఆపయిని ?

ఉప—అపైని నేను మిక్కిలి త్వరితముగాఁ బఱచి దండకారణ్యమునఁ బ్రవేశించితిని. అంతట మందరగిరికి సమీపమునఁ గట్టఁబడిన మధుసూదనాలయము చేరవను—

ఉ. బాహుబలంబులఁ గౌరవుల భగ్నము చేసిరి రాలరత్నముల్ ;
ద్రోహిమానసున్ శిరోమణుల దొంగిలిఁ ద్రెంచిరి కేశపాశముల్ ;
దేహాళిఁ దారహారములు త్రెంచి, హరించిరి కట్టుబట్టముల్ ;

పురు—తరువాత ? తరువాత ?

ఉప—అప్పుడు దేవాలయములోనుండి వెడలివచ్చి గదాపాణులైన పురుషులు వారి నతినిర్దయముగా మోఁదఁగా భీతులై యంతటను దిగంతములకుఁ బాఱిపోయిరి.

వివే—(హర్షముతో) పూజ్యులవయిన నిన్నతిక్రమించువారిని విశ్వసాక్షియైన భగవంతుఁడు క్షమింపఁడుగదా ?

పురు—తరువాత ? తరువాత ?

ఉప—దేహముతోడ, సంతసముతోఁ, గీతగృహంబు చొచ్చితిన్. అక్కడ నాకూఁతురైన గీతాదేవి చేరవచ్చి నన్నుఁ జూచి, సంభ్రమముతో "అమ్మా ! అమ్మా !" అని కౌఁగిలించుకొని కూరుచుండఁబెట్టెను. అప్పుడామె నావృత్తాంతమును విని, "అమ్మా ! నీవు మనస్సులో ఖేదమును బొందఁబోకు, ఏఖలులు నిన్ను పరిభవించిరో వారిని గాఁ జేసి యథేచ్ఛముగా నాస్తికబద్ధులగు చరింతురో వారి నీశ్వరుఁడే శిక్షించును. ఆస్తికులను గూర్చి భగవంతుఁడు గీతలయందు—

గీ. అట్టి క్రూరులఁ బాపుల నధమనరుల
ద్వేషకాముకులఁ గ్రోధనులఁ దీవ్రగతిని
సంతతము నేను సంసారసాగరముల
లోన నొక్కట నాసురయోనులందె.

అనెను.

పురు—(సకౌతుకముగా) దేవి ! ఆయీశ్వరుఁడెవఁడో నీయనుగ్రహమువలన దెలిసికొనఁ గోరుచున్నాను.

ఉప—(కోపించినదానివలె) ఎన్నఁడు తన్నుఁదాఁ దెలిసికోలేక యుంటివివలెఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁడో యాతఁడే.

పురు—(హర్షముతో) ఏమి ! నేనే యాపరమేశ్వరుఁడనా ?

ఉప—అవును.

పరుఁడు నీకంటెఁ గాఁ డెన్నఁడు పరమపురుషా ;
న్యూఁడవు గావు నీవు మహాత్మకుఁడవై ;

పురు—(ధ్యానము నటించుచున్నాఁడు.)

(నేపథ్యమునందు) ఆశ్చర్యము! ఆశ్చర్యము!

మ. ఉరుకాంతిచ్ఛటలన్ దిశావళుల విద్యుల్లీల వెల్గింపుచున్,
ఖరదీప్తాప్తివిశాలమౌ మనసువక్షం బుచ్చిపోఁ బుట్టి, త
త్పరివారంబును మోహుని న్మ్రింగవి, విద్యాకన్య తోడ్తోనగో
చరయై పోయెఁ; బ్రబోధచంద్రుఁడును దా జన్మించె జీవున్ననన్.

[అప్పుడు ప్రబోధచంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ప్రబో—సీ. స్మృతమొ, వ్యాప్తమో, మఱి యుపోహితమో, యుపసారితంబొ, సం
భూతవిలాపితంబొ, హృతమో, యనుతర్కము లేక, యేని సం
జాతముచేఁ బ్రపంచము వెసం జెడునో సహజప్రకాశలీ
నాతతరూపమై, యలమహాత్ముఁడ నేను బ్రబోధచంద్రుఁడన్.

(ముందుకు నడిచి) ఇతఁడే పురుషుఁడు. ఈతని డాపునకుఁ బోయెదను. (సమీపించి) దేవా! ప్రబోధచంద్రుఁడను నేను నమస్కారము చేయుచున్నాను.

పురు—(ఆహ్లాదముతో) వత్సా! రమ్మి. నన్నుఁ గౌఁగిలించుకొమ్మి.

ప్రబో—(ఆలింగనము చేయుచున్నాఁడు.)

పురు—(ఆనందముతో) ఓహో! ఇప్పుడు విధూతతిమిరజాతమయి ప్రభాతము సంజాతమయినది!

చ. ఒకటఁ బ్రబోధచంద్రమహితోదయ మాటను జేసి యియ్యెడన్
బ్రకటవికల్పనిగ్రహము బ్రస్ఫుటమోహతమంబుఁ బాయఁగాఁ,
జకచక నేనె శ్రద్ధ మతి శాంతి వివేక శమంబు లాదిగా
సకలజగన్మయుండనయి యేసంగముఁ విష్ణువుగా స్ఫురించెదున్.

[...]ముల చేతను నేను విష్ణుభక్తిదేవిప్రసాదమువలనఁ గృతకృత్యుఁడ నయినాఁడను.

[...]డు—

[...]చి సమస్తసంగములు, నేఁడక విశ్వములోని దేదియున్,
[...] మూలలంటొ ఫలకాంక్షయొనర్పక సంచరించుచున్,
[...]పమున్ భయము శోకము మోహము నుజ్జగించి, యి
[...]తి శాంతి భ్రశముం గని, గాత్రియె నిల్చుతావుగన్.

విష్ణుభక్తిదేవి ప్రవేశించుచున్నది.]

[...]సమీపించి) శమితారాతివైయున్న నిన్నిప్పుడు చూచు[...]
[...] నామనోరథములన్నియు సంపూర్ణములయినవి!

పురు — దేవిగారి ప్రసాద మున్నప్పుడు దుష్కర మేది యుండును ? (అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

విష్ణు — (పురుషుని లేవనెత్తుచు) వత్సా! లెమ్ము. ఇంకను నేను నీకేమి ప్రియము చేయుదును ?

పురు — ఇంతకంటె నాకుఁ బ్రియమేమున్నది ?

క. కృతకృత్యుం డయ్యెను దా
హతవిమతస్తోముఁ డగుచు నల్లవిభేదుం;
డతివళితరజస్కుఁడునై
యతులసదానందపదవి నందితి నేనున్.

అయినను దా నీ భరతవాక్యము సిద్ధించునుగాక !

చ. ఇలపయి నిష్టవృష్టిఁ గురియించునుగా వృత్ర మేఘుఁ డెంతయున్ !
గలుషుల రాజు లేలుదురుగాక మహి న్నిరుపద్రవంబుగన్ !
వెలి తెలివిందమంబడఁచి భీ మమతా విషయోగ్రసంక్రమై
కలఁచు భవాబ్ధి దాఁటుదురుగాక మహాత్ములు నీదు సత్కృపన్ !

సంపూర్ణము.

